శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః



శ్రీ వేదాంత దేశికులు కటాక్షించిన

# దేహళీశస్తుతి




**ఆంధ్ర వ్యాఖ్యానం::**

పండితరత్న, ఉ.వే.శ్రీమాన్
ఈయుణ్ణి అహ్లూహ శింగరాచార్య స్వామి వారు

**సంపాదకులు::**

ఉ.వే.శ్రీమాన్ మొలుగు వేంకటాచార్యులు


**18, జూలై, 2021**

# అవతారిక

శ్రీ వైష్ణవ సంప్రదాయానికి చెందిన ఆచార్య పరంపరలోనే కాక సంస్కృత సాహిత్యంలో కూడా వేదాంత దేశికులకు గొప్ప స్థానం ఉన్నది. అత్యంత ప్రతిభావంతులైన కవి పండితులలో వీరు అగ్రేసరులు. వీరు నూటికి పైగా గ్రంథాలను సంస్కృత, ద్రావిడ, ప్రాకృత, మణిప్రవాళ భాషలలో రచించారు. వీరు సంస్కృతంలో రచించని



**శ్రీ వేదాంత దేశికులు, కాంచీపురం**

ప్రక్రియ కానీ, రచించి సఫలం కాని ప్రక్రియ కానీ లేదనేది వాస్తవం. వీరు ప్రౌఢకవి, అసమానమైన శాస్త్ర పాండిత్యం

కలవారు, గొప్ప విమర్శకులు, అంతకుమించి ఆత్మగుణ సంపన్నులు. ఎంత విద్వాంసులో అంత నిగర్వి. ఏనాడు ఏ సన్మానాన్ని ఆశించిన వారు కారు.

వీరు సంస్కృతంలో రచించిన స్తోత్రాలు 28. వాటిలో దేహళీశస్తుతి స్తుతి ఒకటి. ఈ స్తోత్రం తిరుక్కోవలూర్ అనే దివ్యదేశంలో పణ్ణానదీతీరంలో వేంచేసి ఉండే అర్చా-మూర్తిని ఉద్దేశించి రచింపబడింది. ఇందులో 28 శ్లోకాలున్నాయి. ముదలాళ్వార్లకు దేహళిలో (ఇంటిగడపలో) సాక్షాత్కరించిన స్వామిని కీర్తిస్తూ రచింపబడినందున దీనికి ఈ పేరు వచ్చింది. ఈ పేరును దేశికులే పెట్టారనే విషయం చివరి శ్లోకంలో వ్యక్తమవుతున్నది.

తిరుక్కోవలూర్ దివ్యదేశంలో భగవానుడు త్రివిక్రమరూపిగా దర్శనమిస్తున్నాడు. ఇతని కుడిపాదం ఊర్ధ్వలోకం దిశగా చాచబడి దర్శనమిస్తున్నది. ఇక్కడ స్వామి ఎడమచేతిలో చక్రాన్ని, కుడి చేతిలో శంఖాన్ని ధరించడం విశేషం.

మృకండుముని ఈ క్షేత్రంలో గల పణ్ణానదీతీరంలో తపస్సు చేసినట్లు, అతనిని అనుగ్రహించడం కోసం భగవానుడు ఇక్కడ ప్రత్యక్షమైనట్లు స్థలపురాణం తెలుపుతున్నది. ఇక్కడి స్వామికి త్రివిక్రముడు, దేహళీశుడు, గోపపురీశుడు, ఆయనార్ మొదలైన నామాలున్నాయి. ఈ క్షేత్రంలో ప్రవహించే పణ్ణానదిని కూడా దేశికులు కొన్ని

శ్లోకాలలో స్తుతించారు. ఈ దివ్యదేశంలోనే ముదలాళ్వార్లు మృకండుముని ఆశ్రమంలోని దేహళిలో భగవానుని దర్శించి, ఆ అనుభవాన్ని వ్యక్తం చేస్తూ మూడు తిరువందాది ప్రబంధాలను పాడారు.



ఈ స్తుతిని దేశికులు త్రివిక్రముని స్తుతితో ఆరంభించారు. ఆ స్వామి అనుగ్రహంతో దేవతలు తాము

కోరిన ఫలాన్ని పొందడం, అతడు తన హస్తాలలో శంఖచక్రాలను మార్చి ధరించడం, ముదలాళ్వార్లను భగవానుడు అనుగ్రహించడం, త్రివిక్రముడై పెరిగిన వృత్తాంతం, వామనమూర్తిగా మహాబలి యాగశాలకు వెళ్ళడం, దేవగంగ అతని చరణాలనుండి ప్రవహించడం, దేవగంగ భూమికి వచ్చిన క్రమం, పణ్ణానది మహిమ – మొదలైనవానిని గూర్చి పల్కి, తమను రక్షించమని పలు మార్లు అర్థించి, పంచసంస్కారాలను పొందినవారికి భగవానుడు చేసే అనుగ్రహాన్ని తెలిపి, ఈ స్తుతిని పఠించినవారికి వారు కోరిన ఫలం సిద్ధిస్తుందని పల్కి, ఈ స్తుతిని దేశికులు ముగించారు.

ఈ స్తుతిలోని పలు శ్లోకాలలో ముదలాళ్వార్ల వృత్తాంతం ప్రధానంగా ప్రస్తావింపబడడం గమనించవచ్చు. పొయ్ కైయాళ్వార్లు, పూదత్తాళ్వార్లు, పేయాళ్వార్లు అనే ముగ్గురు ఆళ్వార్లు ఒక్కొక్కరుగా ఒకనాడు రాత్రివేళ తిరుక్కోవలూర్ లోని మృకండుముని ఆశ్రమానికి వచ్చి చేరారు. చాలా చిన్నది అయిన ఆ ఆశ్రమంలో వారు ముగ్గురు కలసి భగవదనుభవాన్ని పొందుతూ ఉండగా, పెద్ద వాన వచ్చింది. చాలా చీకటితో ఏమీ కంటికి కనుపించని ఆ సమయంలో భగవానుడు వారిని అనుగ్రహించాలని తలచి, ఆ చీకటివేళ వారి మధ్యకు వచ్చి చేరి, వారికి సమ్మర్దాన్ని కల్గించాడు. తమ మధ్యకు ఎవరో నాలుగవ వ్యక్తి వచ్చి చేరినట్లు గుర్తించిన ఆళ్వార్లు ఆ వ్యక్తి ఎవరో తెలిసికోవాలని అనుకొన్నారు. అపుడు భగవానుడు వారికి తన

దివ్యసాక్షాత్కారాన్ని కలిగించి, దివ్యజ్ఞానాన్ని ప్రసాదించాడు. ఆ అనుభవాన్ని వారు ముగ్గురు మూడు తిరువందాది ప్రబంధాల రూపంలో లోకానికి అందించారు.

ఈ దివ్యదేశంలో ఇంకొక విశేషంకూడా ఉన్నది. ఇక్కడ భగవానుడు చక్రాన్ని ఎడమ చేతిలో, శంఖాన్ని కుడి చేతిలో కలిగి ఉన్నాడు. పూర్వం మృకండుముని ఇక్కడ ఆశ్రమాన్ని నిర్మించుకొని, భగవానుని గూర్చి చాలా తీవ్రమైన తపస్సును చేశాడట. అతని తపస్సుకు మెచ్చిన స్వామి అతని కోరికను తీర్చడంకోసం ఈ విధంగా శంఖచక్రాలను మార్చి ధరించాడని స్థలపురాణం తెలుపుతున్నధి. ఈ రెండు వృత్తాంతాలను దృష్టిలో పెట్టుకొని ఈ స్తుతిని అనుసంధించాలి.

ప్రస్తుతం ఈ స్తోత్రం తాత్పర్యంతో పాటు పాఠకలోకానికి సమర్పింపబడుతున్నది. ఈ గ్రంథాన్ని సిద్ధం చేయడంలో సహకరించిన సహృదయులు, **ఉ.వే.శ్రీమాన్ మొలుగు వేంకటాచార్యస్వామి** వారికి అనేక దాసోహాలు. స్వస్తి .

**దేహళీశనుతి స్సేయం తాత్పర్యేణ సమర్ప్యతే,**
**ఆస్తికానాం ముదే వర్ణచిత్రమాలాపరిష్కృతా.**

**భాగవత విధేయుడు**
**ఈ ఏ శింగరాచార్యులు**



శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః

# దేహళీశస్తుతి

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కిక కేసరీ ।
వేదాన్తాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

## ॥ 01 ॥ భగవానుడు లోకాలను కొలిచిన గొప్పతనం:

విక్రమ్య యేన విజితాని జగన్తి భూమ్నా
విశ్వస్య యం పరమ కారణమామనన్తి ।
విశ్రాణయన్ ప్రణయినాం వివిధాన్ పుమర్థాన్
గోప్తా స మే భవతు గోపపురాధిరాజః ॥

వామనావతారంలో భగవంతుడు బలి చక్రవర్తి దగ్గర మూడడుగుల నేలను యాచించి పొంది, త్రివిక్రముడై, తన పాదాలతో లోకాలను అన్నిటిని వ్యాపించి కొలిచి తన వశం చేసికొన్నాడు. వేదాలు, వాటిని ప్రమాణంగా గ్రహించిన మహర్షులు, ఆళ్వార్లు, ఆచార్యులు అందరూ భగవంతుని అన్నిటికంటే గొప్పదైన మొదటి కారణంగా పలుకుతున్నారు. ఇటువంటి భగవంతుడు తిరుక్కో-

వలూరు అనే క్షేత్రంలో నెలకొని ఉండి, తన భక్తులకు అన్ని విధాలైన పురుషార్థాలను ఇస్తున్నాడు. ఆ స్వామి నన్ను కూడా రక్షించేవాడుగా కావాలి.

## ॥ 02 ॥ కవిత్వాన్ని చెప్పడానికి ధైర్యం చేసిన కారణం:

**దేహల్యధీశ్వర తవేదృశమీశ్వరత్వం**
**తుష్టూషతాం దిశతి గద్గదికానుబన్ధమ్ ।**
**వాచాలయస్యథ చ మాం క్వచన క్షపాయాం,**
**క్షాన్తేన దాన్తకవిముఖ్యవిమర్దనేన ॥**

తిరుక్కోవలూరు అనే క్షేత్రంలో ఇంటి ముందు భాగంలో వేంచేసి ఉండే స్వామీ! నీ ఈశ్వరత్వానికి పొగడడం సులభం కాదు. నిన్ను స్తుతించాలని ఆరంభించిన బ్రహ్మ మొదలైన వారికి కూడా భయంతో గొంతు తడబడుతున్న ది . అందువల్ల వారు స్తుతించే లేక తమ నోరును మూసికుంటున్నారు. ఆ విధంగా ఉండగా నేను నిన్ను స్తుతించాలి అని ప్రయత్నించడం నవ్వుకే కారణం అవుతుంది. ఐనా, అటువంటి నీ ఈశ్వరత్వం నాకు ధైర్యాన్ని కలిగిస్తున్నది. పూర్వం ఒకనాటి రాత్రి గొప్ప వైరాగ్యాన్ని కలిగిన ముగ్గురు దివ్యసూరులు ఒక ఇంటి మధ్య భాగంలో సర్వేశ్వరుడవైన నిన్ను సమ్మర్ధించగా, దానిని నీవు సహించి, వారి ద్వారా పాశురాలను పాడించావు కదా. ఆ

ఈశ్వర స్వభావమే ఇప్పుడు నాకు ధైర్యాన్ని కలిగించి నన్ను కవిత్వం చెప్పేటట్లు చేస్తున్నది.

## ॥ 03 ॥ దేవతలు అసురులు హితాన్ని పొందడం:

**త్వచ్చక్రవద్ద్రుతమనేహసి ఘూర్ణమానే**
**నిమ్నోన్నత క్రమనిదర్శిత నేమివృత్తాః।**
**ఆరాధ్య గోపనగరే కృపయోదితం త్వాం**
**స్వారాజ్యమగ్ర్యమలభన్త సురాసురేన్ద్రాః**

తిరుక్కోవలూరు లో వేంచేసి ఉండే స్వామీ! నీ చక్రాయుధం ఎంత వేగంగా తిరుగుతుందో అంత వేగంగా కాలం కూడా తిరుగుతున్నది. నీ చక్రాయుధం పరిభ్రమించేటప్పుడు దాని మొన కిందకి పైకి మాటిమాటికి తిరుగుతుంది. ఆ విధంగానే దేవతలకు నాయకుడైన బ్రహ్మ, ఇంద్రుడు మొదలైనవారు, అసురులకు ప్రభువులైన బలి, వృత్రుడు మొదలైనవారు మాటిమాటికి ఉన్నత స్థితిని, అధమ స్థితిని పొందుతున్నారు. వారు తమ తమ అధికారాలలో ఉండేటప్పుడు గొప్పతనాన్ని పొందినట్లుగా, అధికారం కోల్పోయినప్పుడు తక్కువదనాన్ని పొందినట్లుగా భావిస్తున్నారు. అందువల్ల వారు అధికారం, గొప్పతనం స్థిరంగా ఉండేవి కావు అని గ్రహించి, తిరుక్కోవలూరులో నెలకొని ఉండే నిన్ను ఆరాధించి, భక్తి ప్రపత్తులలో ఏదో ఒక దానిని

ఆచరించి, కర్మకు వశమై ఉండే స్థితిని పోగొట్టుకొని ముక్తిని పొందుతున్నారు. కొందరు దేవతలు, అసురులు నీ పాదాలను ఆశ్రయించి స్వర్గలోకాన్ని పొందుతున్నారు. ఈ విధంగా పలువురు దేవతలు, అసురులు కరుణతో తిరుక్కోవలూరు లో అవతరించిన నిన్ను ఆరాధించి తమ తమ కోరికలను, గొప్ప ఫలమైన ముక్తిని పొందుతున్నారు.

## ॥ 04 ॥ స్వామిని ఒక పచ్చని చెట్టుతో పోల్చడం:

**ఆకల్ప పుష్పసుభగోన్నత బాహుశాఖః**
**పాదే సదా పరిపచేలిమ సత్ఫలస్త్వమ్ ।**
**పణ్ణాతటస్పృశి మృకణ్డు తపోవనేऽస్మిన్**
**ఛాయానిలీన భువనోऽసి తమాల శాఖీ ॥**

తిరుక్కోవలూరులో ఉండే స్వామీ! త్రివిక్రముడవైన నిన్ను నేరుగా సేవించాలని కోరి, పణ్ణా నది తీరంలో ఉండే వనంలో ఒక ఆశ్రమాన్ని నిర్మించుకొని అందులో మృకండుముని తపస్సు చేశాడు. ఆ తపోవనంలో నీవు అవతరించావు. ఆ నదీ తీరంలో ఉండే తపోవనంలో పెరిగిన ఒక పచ్చని వృక్షం వలె నీవు చల్లగా సాక్షాత్కరిస్తున్నావు. నీవు అలంకరించుకున్న ఆభరణాలు ఆ వృక్షంలోని పుష్పాలు దీర్ఘంగా ఉండే అందమైన నీ బాహువులే ఆ వృక్షంలోని కొమ్మలు. నీ పాదాలే ఆ



వృక్షంలోని పాద భాగం. భక్తులకు ఈ పాదాలు అనుగ్రహించే ఫలాలే వృక్షంలోని పండిన పండ్లు. దగ్గరకు వచ్చిన వారి సంసార తాపాన్ని పోగొట్టే ఈ కాంతి ఎండవేడిమిని పోగొట్టే ఆ వృక్షం యొక్క నీడ. ఆ నీడలో లోకం అంతా ఇమిడి ఉన్నది. ఈ విధంగా భక్తుల నేత్రాలను చల్లగా చేసే ఒక పచ్చ వృక్షం వలె నీవు ప్రకాశిస్తున్నావు.

## ॥ 05 ॥ తిరుక్కోవలూరులో భగవంతుని చేతిలో శంఖ చక్రాల స్థానం మారి ఉండడం:

**చక్రస్య దైత్య దనుజాదిషు వామ భావం**
**శఙ్ఖస్యచాశ్రిత జనేష్వపి దక్షిణత్వమ్ ।**
**వ్యక్తం ప్రదర్శయసి గోపపురాధిరాజ**
**వ్యత్యస్య నూనమనయోః కరసమ్ప్రయోగమ్ ॥**

తిరుక్కోవలూరులోని స్వామీ! నీవు చక్రాయుధాన్ని ఎడమ చేతిలోనూ, శంఖాన్ని కుడిచేతిలోను ధరించి



ఉన్నావు. దీనివల్ల ఏమి తెలుస్తూ ఉన్నది? అని అంటే, చక్రాయుధం అసురుల విషయంలో వామంగా, అంటే, చాలా కఠినంగా ఉండడం వల్ల వామమనే ఎడమచేతిలోను,

శంఖం దాసుల అభిప్రాయాలకు అనుకూలంగా ఉండడంవల్ల దక్షిణమనే కుడవైపు చేతిలోను ఉన్నాయి. ఈ విధంగా రెండు దివ్యాయుధాల రెండు వేరు వేరు స్వభావాలను లోకానికి స్పష్టంగా తెలుపడం కోసమే వీటిని నీవు మార్చి ధరించావు కాబోలు.

చక్రం వామమై, అంటే, కఠినమై ఉండడంవల్ల వామ హస్తంలోను, శంఖం ఇతరుల అభిప్రాయాన్ని అనుసరించి ఉండేది అయినందున దక్షిణం, అంటే, కుడిచేతిలోను నీవు ధరిస్తున్నావా ఏమి? అనేది ఇక్కడ హార్ధభావం.

## ll 06 ll ముదలాళ్వారులు భగవంతుని దర్శించడం:

**దీపేన కేనచిదశీతరుచా నిశీథే**
**స్నేహోపపన్నపరిశుద్ధగుణార్పితేన ।**
**దహ్నావకాశ నిబిడం దదృశుర్భవన్తం**
**స్వాధ్యాయయోగనయనాః శుచయః కవీన్ద్రాః ॥**

ముదలాళ్వారులు సహజమైన మనఃపవిత్రతను కలవారు. గొప్ప పాశురాలను పాడినవారు. వీరు వేదాలద్వారా నిన్ను తెలిసి కొని, యోగం ద్వారా నిన్ను సాక్షాత్తు దర్శించగలరు. అందువల్ల వేదం, యోగం వారికి రెండు నేత్రాలు. వీరు ముగ్గురు తిరుక్కోవలూరు క్షేత్రంలో ఒకనాటి రాత్రి ఒక చిన్న ఇంటిలోని మధ్య భాగంలో కలుసుకొన్నారు.

అప్పుడు నీవు కూడా వారి మధ్యకు చేరి వారితో కలిశావు. ఆ సమయంలో ఈ ఆళ్వార్లు ముగ్గురు నిన్ను దర్శించి ఆనందించారు. రాత్రి సమయంలో చంద్రుడు ప్రకాశించి



వస్తువులను దర్శింప చేయడం లోకరీతి. ఈ ముగ్గురు చంద్రునికంటే భిన్నమైన  ఒక అద్భుతమైన దీపాన్ని వెలిగించి నిన్ను దర్శించారు. ఈ ముగ్గురు నీ విషయంలో తాము కలిగి ఉండే గొప్ప భక్తితో కలసిన అతి పవిత్రమైన సత్వగుణంతో దీపాన్ని వెలిగించి నిన్ను దర్శించారు. లోకంలో ఒకపాత్రలో నేయిని పోసి వత్తిని వేసి దీపాన్ని వెలిగిస్తారు. సరోయోగి లోకాన్ని ఒక పాత్రగా, సముద్రాన్ని నేయిగా, సూర్యుని ఒక అద్భుతం దీపంగా చేసికొని నిన్ను దర్శించారు. భూత యోగి నీ విషయంలో ఉండే ప్రేమే పాత్రంగా చేసి, నిన్ను దర్శించడంలో ఉండే ఆర్తిని నెయ్యిగా చేసి, నీ కళ్యాణ గుణాలకు సంబంధించిన

చింతనను వత్తిగా చేసి జ్ఞాన రూపమైన భక్తిని దీపంగా వెలిగించి నిన్ను దర్శించారు. మహాయోగి, పై ఇద్దరు ఆళ్వారులు వెలిగించిన దీపాలతో చీకటి తొలగిపోగా, వీరు ఏ సాధనం లేకుండా తమ భక్తితోనే నిన్ను దర్శించారు. ఈ విధంగా ముదలాళ్వారులు ముగ్గురు నిన్ను దర్శించి పాడిన ప్రబంధాలు ద్రావిడ వేదానికి ఆరంభం అయ్యాయి.

## II 07 II ముదలాళ్వార్లవల్ల భగవంతుని సౌశీల్యం వ్యక్తం కావడం:

**కాసారపూర్వకవిముఖ్యవిమర్దజన్మా**
**పణ్ణాతటేక్షు సుభగస్య రసో బహుస్తే।**
**త్వత్పాదపద్మ మధుని త్వదనన్యభోగ్యే**
**నూనం సమాశ్రయతి నూతన శర్కరాత్వమ్ II**

నదీతీరంలో మొలిచి, బాగా ఏపుగా పెరిగి పండిన చెరకును యంత్రంలో పెట్టి రసాన్ని తీసినప్పుడు, ఆ చెరకురసం చాలా మధురంగా ఉంటుంది. ఆ రసం తామర పువ్వు నుండి వచ్చే గొప్ప తేనెతో కలిస్తే ఇక దాని తీయదనాని కి అంతు ఉండదు. తిరుక్కోవలూరులో నెలకొని ఉండే స్వామివి అయిన నీవు పణ్ణానది తీరంలో బాగా ఏపుగా పెరిగిన చెరకువలె ఉన్నావు. ఈ చెరకును ముదలాళ్వారులు మర్దించినందున దానిని యంత్రంలో పెట్టి పిండినట్లు అయినది. ఆ విధంగా మర్దించడంవల్ల



ఉన్నతమైనవాడు చాలా తక్కువవానితో ఏ తేడా లేకుండా కలసి వర్తించడం అనే సౌశీల్యగుణం వ్యక్తం అయినందున, అదే చెరకు రసం అయినది. ఆ రసమే గట్టిపడి చక్కెర అయినది. వేరు ఏ దైవాన్ని, వేరు ఏ ప్రయోజనాన్ని కోరని పరమైకాంతులు నీ పాదపద్మాల మకరందాన్ని సేవించి ఆనందించేటప్పుడు ఆ సౌశీల్య గుణం అనే చెరకురసం లోకంలో ఒక అద్వితీయమైన చక్కెరగా భాసిస్తున్నది. తేనెలో చక్కెర కలిసినట్లు వారు నీ చరణాలను అనుభవించేటప్పుడు సౌశీల్య గుణం స్ఫురించి, కలసి, ఆ అనుభవాన్ని ఎంతో భోగ్యంగా చేస్తున్నది.

## ll 08 ll వామనుడు త్రివిక్రముడై పెరగడం:

**వైరోచనేస్సదసి వామనభూమికావాన్**
**విక్రాన్తి తాణ్డవరసేన విజృమ్భమాణః।**
**చక్రే భవాన్మకరకుణ్డలకర్ణపాశః**
**శ్యామైకమేఘభరితామివసప్తలోకీమ్ ॥**

తిరుక్కోవలూరులోని స్వామీ! పూర్వం నీవు బలి చక్రవర్తి యాగశాలలోకి వామన రూపంతో వెళ్లి అతని దగ్గర నుండి మూడడుగుల నేలను దానంగా పొందావు. తర్వాత లోకం అంతటినీ ఆక్రమించి గ్రహించే ఆశతో ఇంకా ఇంకా పెరిగి త్రివిక్రముడవై తాండవం చేసి, ఏడు లోకాలను వ్యాపించావు. అప్పుడు నీవు ఉండే స్థితి ఏడు లోకాలను ఒక నీలమేఘం ఆక్రమించినట్లు ఉన్నది. నీ చెవులలో అలంకరించుకున్న మకర కుండలాలు వెలువరించే కాంతి ఆ మేఘంలో ప్రకాశించే మెరపు వలే గోచరించింది. ఆ విధంగా ఏడు లోకాలను ఆక్రమించిన నీవు ఇప్పుడు తిరుక్కోవలూరులో ఒక చిన్న ఇంటి మధ్య భాగంలో ముగ్గురు దివ్యసూరులచే మర్దించబడి, ఆనందాన్ని పొందుతున్నావు.

**II 09 II భగవంతుడు ముదలాళ్వారులతో ఇంటి మధ్య భాగంలో కలసి ఉండడం:**

**చిత్రం న తత్త్రిషు మితాని పదేషు ధత్తే**
**విశ్వాన్యమూని భువనాని విశంకటేషు ।**
**భక్తైస్సమం క్వచిదసౌ భవనైకదేశే మాతి**
**స్మ మూర్తిరమితా తదిహాద్భుతం నః ॥**

తిరుక్కోవలూరులోని స్వామీ! బలి యాగశాలలో నీవు త్రివిక్రముడై లోకాలను కొలిచిననప్పుడు నీ విశాలమైన మూడు పాదాలలో సకలలోకాలు అణగిపోయాయి - అనేది మాకు అద్భుతంగా అనిపించలేదు. కాని, ఈ లోకంలో ఒకనాటి రాత్రి ఒక ఇంటిలో చాలా చిన్నదైన మధ్య భాగంలో నీవు చాలా పెద్ద రూపంతో నీ భక్తులైన ముదలాళ్వారులతో కూడా నీవు అణగి ఉండడమే చాలా ఆశ్చర్యంగా అనిపిస్తున్నది.

**II 10 II భగవంతుడు త్రివిక్రముడై పెరగడాన్ని వర్ణించడం:**

**భక్తప్రియ త్వయి తథా పరివర్ధమానే,**
**ముక్తావితానవితతిస్తవ పూర్వమాసీత్ ।**

**హారావళిః పరమథో రశనాకలాపః**
**తారాగణస్తదను మౌక్తికనూపురశ్రీః ॥**

తిరుక్కోవలూరులోని స్వామీ! నీవు బలి చక్రవర్తి యాగశాలలో ఆ విధంగా త్రివిక్రముడవై పెరిగినప్పుడు, నీ పాదానికి పైన వ్యాపించి ఉండే నక్షత్రాల సమూహం మొదట ముత్యాలతో చేయబడిన మేల్ కట్టువలె కనిపించింది. ఆ తరువాత ఇంకా నువ్వు వ్యాపించినప్పుడు నీ కంఠానికి ఉండే ముత్యాల మాల వలే తోచింది. ఆ తరువాత ఇంకా పెరిగినప్పుడు నక్షత్రాల సమూహం నీ నడుముకు ముత్యాలతో చేయబడిన మొలనూలు వలె కనిపించింది. ఆ పిమ్మట నీవు ఇంకా పెరిగినప్పుడు నీ పాదాలకు అది ముత్యాలతో చేసిన మంజీరం వలె తోచింది. ఈ విధంగా ఆ చాలా పెద్ధ రూపాన్ని తిరుక్కోవలూరులో చిన్న ఇంటిలో మధ్య భాగంలో అణిగి ఉండేటట్లు చేసికోవడం నీ భక్తులైన ముదలాళ్వారుల ఈ విషయంలో నీకు కల ప్రేమాతిశయం వల్లనే కదా.

## ॥ 11 ॥ ఏ దశలోనూ భగవంతుని లక్ష్మీదేవి విడచి ఉండకపోవడం:

**భిక్షోచితం ప్రకటయన్ ప్రథమాశ్రమం త్వం**
**కృష్ణాజినం యవనికాం కృతవాన్ ప్రియాయాః ।**

**వ్యక్తాకృతేస్తవ సమీక్ష్య భుజాన్తరే తాం**
**త్వామేవ గోపనగరీశ జనా విదుస్త్వామ్ ॥**

తిరుక్కోవలూరులోని స్వామీ! నీవు పూర్వం బలిచక్రవర్తి యాగశాలకు మూడడుగుల నేలను అడగడానికి వెళ్ళినప్పుడు బ్రహ్మచారి వేషాన్ని ధరించి



వెళ్ళవలసి వచ్చింది. ఇదే కదా మొదటి ఆశ్రమం. రెండవ ఆశ్రమం అయిన గృహస్థాశ్రమంలో ఉండేవాడవుగా పెడితే ఎవరు భిక్షను ఇవ్వరు కదా. అందుకోసం నడుముకు తగిన

వస్త్రం, తగిన యజ్ఞోపవీతం, మౌంజి, దండం మొదలైన బ్రహ్మచారి చిహ్నాలతో నీవు వెళ్లావు. లక్ష్మీదేవి ఏనాడు కూడా ఏ సమయంలోనూ నిన్ను విడిచి పెట్టి ఒక్క క్షణం కూడా ఉండదు కదా. అందువల్ల నువ్వు నీ వక్షస్థలంలో జింక తోలును యజ్ఞోపవీతంగ కప్పుకొని లక్ష్మీదేవిని దానితో మరుగు పరచుకొన్నావు. తరువాత నీవు విశ్వరూపాన్ని వ్యక్తం చేస్తూ పెరిగినప్పుడు జనులు నీ వక్షస్థలంలో ఉండే లక్ష్మీదేవిని చూచారు. వెంటనే నీవు లోకానికి కారణమైన పరమపురుషుడవు అనే విషయాన్ని కనుగొన్నారు. లక్ష్మీదేవి వల్ల కదా నిన్ను సర్వేశ్వరుడవని తెలిసికోవడం సాధ్యమవుతుంది.

## II 12 II త్రివిక్రముని వల్ల బ్రహ్మ, శివుడు గొప్పతనాన్ని పొందడం:

**సత్కుర్వతాం తవ పదం చతురాననత్వం**
**పాదోదకం చ శిరసా వహతాం శివత్వమ్ ।**
**ఏకత్ర విక్రమణకర్మణి తదద్వయం తే**
**దేహల్యధీశ యుగపత్ప్రథితం పృథివ్యామ్ II**

తిరుక్కోవలూరులోని స్వామీ నీవు పూర్వం త్రివిక్రముడవై లోకాలను కొలిచావు. అపుడు పై లోకం వ్యాపించిన నీ పాదాన్ని పూజించిన బ్రహ్మ అతిశయాన్ని పొందాడు. ఆ పాదం నుండి స్రవించిన తిరుమంజనం

తీర్థాన్ని తన శిరస్సుపై ధరించిన శివుడు పవిత్రతను పొందాడు. తిరుక్కోవలూరులోని ఒక ఇంటి మధ్య భాగంలో వచ్చి అవతరించిన నీ ఈ చరణాలను పూజించి, నీ పాదాల తిరుమంజన తీర్థాన్ని శిరస్సుపై ధరించేవారు ఒకే సమయంలో ఈ లోకంలోనే చతుర్ముఖునిగా, శివుని గా అవుతున్నారు. అంటే, చాతుర్యంతో పలుకగలిగినవారుగా, మంగళకరమైన స్వభావాన్ని కలిగినవారుగా అవుతున్నారు.

## ll 13 ll భగవంతుని పాదం నుండి గంగా నది అవతరించడం:

**భక్తోపరోధ సహ పాదసరోజత స్తే**
**మన్దాకినీ విగలితా మకరన్దధారా ।**
**సద్యస్త్రివర్గమపవర్గమపి క్షరన్తీ**
**పుణ్యా బభూవ పురశాసన మౌళి మాలా ॥**

తిరుక్కోవలూరులో చిన్న ఇంటి మధ్య భాగంలో పరమ భక్తులైన ముదలాళ్వారులు చేసిన సమ్మర్దాన్ని సహించిన స్వామీ! నీవు త్రివిక్రముడవై పెరిగినప్పుడు నీ పాదపద్మం బ్రహ్మ లోకం వరకు వ్యాపించింది. దానికి బ్రహ్మ తన కమండలులోని తీర్థంతో అభిషేకం చేశాడు. ఆ తీర్థాన్ని శివుడు తన తలపై ధరించాడు. తరువాత ఆ తీర్థధార ఆకాశ గంగా నదిగా పుట్టి, అది 'నీ పాద ద్మం నుండి జాలువారిన తేనెవాకా!' అనేటట్లు ప్రవహించింది. ఇందులో స్నానం

చేసేవారికి ఈ నది ధర్మం, అర్థం, కామం అనే మూడు పురుషార్థాలను కోరిన సమయంలో ఇస్తుంది. ఇంతే కాదు,



వారికి మనఃపవిత్రతను కూడా కలిగించి, నీ చరణాలలో శరణు పొందేటట్లు చేసి మోక్షాన్ని కోరినప్పుడు అది లభించేటట్లు చేస్తుంది. ఇటువంటి గొప్పతనాన్ని కల గంగా నది నీ పాదం నుండి పట్టింది. అందువల్ల చాలా పవిత్రమైనది అని భావించి శివుడు తన శిరస్సుపై దానిని అలంకారంగా ధరిస్తున్నాడు. ఆహా! గంగానది గొప్పతనం ఎంత గొప్పదో కదా!

**II 14 II భగవంతుని పాదం నుండి గంగా నది భూమికి వచ్చిన క్రమం:**

**విక్రాన్తి కేతు పటికా పద వాహినీ తే**
**న్యఞ్చన్త్యుపైతి నత జీవిత శింశుమారమ్ ।**
**ఔత్తాన పాది మమృతాంశుమశీత భానుం**
**హేమాచలం పశుపతిం హిమవన్తముర్వీమ్ ॥**

భక్తులను ప్రాణంగా కలిగిన స్వామి నీవు లోకాలను కొలిచి విజయాన్ని పొందావు. అ జయానికి సూచకంగా ధ్వజాన్ని నాటావు. ఆ ధ్వజానికి కట్టిన తెల్లని వస్త్రం వలె ఉన్నది–నీ పాదాల నుండి ప్రవహించిన గంగా నది. అది మొదట శింశుమార చక్రానికి చేరింది. తరువాత ధ్రువ మండలాన్ని చేరింది. ఆ తర్వాత వరుసగా చంద్ర మండలం, సూర్యమండలం, మేరు పర్వతం, శివుని శిరస్సు, హిమాలయ పర్వతం అనే ఈ చోట్లకు ప్రవహించి, చివరిగా భూమికి ప్రవహించింది. ఈ విధంగా గంగా నది లోకంలో అంతటా నీ విజయాన్ని చాటుతున్నది.

**II 15 II పణ్ణా నది మహిమ:**

**వేధః కమణ్డలు జలైర్విహితార్చనం తే**
**పాదామ్బుజం ప్రతిదినం ప్రతిపద్యమానా ।**

**స్తోత్ర ప్రియ త్రిపథగాది సరిద్వరాణాం పణ్ణా**
**బభూవ భువనే బహుమాన పాత్రమ్ ॥**

భక్తులు చేసే స్తుతులకు మిక్కిలి ఆనందించే స్వామీ!, త్రివిక్రమావతారంలో బ్రహ్మ తన కమండల




జలంతో తిరుమంజనం మొదలైన సేవలను నీ పాదాలకు చేశాడు. అటువంటి నీ పాదపద్మం దగ్గరలో ఎల్లప్పుడూ ఈ పణ్ణా నది ప్రవహిస్తున్నది. అందువల్ల, ఏదో ఒక సమయంలో మాత్రమే నీ పాద సంబంధాన్ని పొందిన గంగానది కంటె, ఇంకా మిగిలిన గొప్ప నదులు అన్నిటికంటే చాలా గొప్పదిగా

చెప్పదగిన యోగ్యత కలిగినది ఈ పణ్ణా నది. ఇదిఎల్లప్పుడు నీ పాద సంబంధాన్ని పొంది ప్రకాశిస్తున్న ది కదా.

## 16) మూడు తిరువందాదిప్రబంధాలు అవతరించడం:

**స్వచ్ఛన్దవిక్రమసమున్నమితాదముష్మాత్**
**స్రోతస్త్రయం యదభవత్తవపాదపద్మాత్।**
**వేతాళ భూత సరసామపదిశ్యవాచం**
**ప్రాయేణ తత్ ప్రసవభూమిమవాప భూయః॥**

తిరుక్కోవలూరులో వేంచేసి ఉండే స్వామీ! ఇప్పుడు నేను సేవించే ఈ పాదాన్నే కదా పూర్వం లోకాన్ని నీవు కోరిన రీతిలో కొలువడం కోసం ఉన్నతంగా ఎత్తావు. అప్పుడు ఆ పాదంనుండి గంగా నది పుట్టి దేవలోకం, మనుష్య లోకం, పాతాళ లోకం అనే మూడు లోకాలలోను మూడు భాగాలుగా ప్రవహించి కదా. ఆ మూడు ప్రవాహాలు తరువాత సరో యోగి, భూత యోగి, మహాయోగి అనే ముదలాళ్వారుల సూక్తులుగా ఆవిర్భవించి మూడు తిరువందాదులు అనే పేరును పొంది, తాము పుట్టిన చోటు అయిన ఆ పాదాన్నే మళ్లీ తిరిగి చేరి, అందులో లయాన్ని పొందాయి. (అంటే గంగ యొక్క మూడు ప్రవాహాల వలే ఆవిర్భవించిన మూడు తిరువందాదులు భగవంతుని శ్రీ చరణాలను కీర్తిస్తున్నాయి అని తాత్పర్యం)

## ॥ 17 ॥ ముదలాళ్వారులను భగవంతుడు వైకుంఠానికి చేర్చడం:

**క్రీడాపరేణ భవతా విహితోపరాధానా-**
**రాధకాననుపరోధముదఞ్చయిష్యన్।**
**తామ్రేణ పాదనఖరేణ తదాణ్డమధ్యే**
**ఘణ్టాపథం కమపి నూనమవర్తయస్త్వమ్**

తిరుక్కోవలూరులో వేంచేసి ఉండే స్వామీ! భక్తుల విషయంలో లీలలను ప్రదర్శించడంలో నీకు ఉద్దేశ్యం ఉన్నది. ఒకనాటి రాత్రివేళ ముదలాళ్వారులు వర్షానికి తలదాచుకున్న ఒక ఇంటి మధ్య భాగంలో నీవు కూడా ప్రవేశించి వారిని మర్దించావు. వారు నిన్ను చూచి దర్శించి చాలా ఆశ్చర్యకరమైన పాశురాలను పాడి నీ గుణాలను కీర్తించి నిన్ను సేవించారు. వారి విషయంలో నీవు చాలా ప్రీతిని, ఆనందాన్ని పొంది, వారిని పూర్వం నీవు మర్దించిన విషయాన్ని తలచి, వారిని శ్రీవైకుంఠానికి పిలుచుకొని పోయేటప్పుడు అయినా ఈ బ్రహ్మాండం లోపల విశాలమైన ఒక నూతనమైన దారిని ఏర్పరిచి, వారికి సమర్థం లేకుండా చేయాలని భావించావు కాబోలు. ఉన్నతంగా ఎత్తిన నీ పాదంలోని నఖాల ఎర్రని కాంతి చాలా దూరం ప్రసరించగా, అది ఆళ్వారుల కోసం నీవు నూతనమైన విశాలమైన రాజమార్గం ఏర్పరిచినట్లు తోస్తున్నది.

## ॥ 18 ॥ భగవంతుని కరుణ సంసార తాపాన్ని తీరుస్తుంది:

**కామావిలేఽపి కరుణార్ణవ బిన్దురేకః**
**క్షిప్తః స్వకేలితరసా తవ దేహలీశ ।**
**తత్సన్తతేరుభయథా వితతిం భజన్త్యాః**
**సంసారదావ దహనం శమయత్యశేషమ్ ॥**

తిరుక్కోవలూరులో వేంచేసి ఉండే స్వామీ! నీ కరుణ అనేది అంతులేని ఒక మహా సముద్రం. దాని నుండి ఒక



చిన్న కణం పడిన చాలు కదా - ఒక జీవుడు తరించడానికి! జీవుడు అవివేకం వల్ల అల్పానందాలలోనే మునిగి, వాటిలోనే పడి ఉన్నాడు. నీ దయ అనే సముద్రంలోని ఒక చిన్న కణాన్ని నీవు లీలగా అతనిపై పడేటట్లు చేస్తే చాలు,

అది భక్తి యోగం యొక్క పలు విభాగాలుగా, ప్రపత్తిలోని పలు విభాగాలుగా విస్తరిస్తుంది కదా. (దీని భావం ఏమంటే – నీ కరుణ లోని ఒక చిన్న భాగమే ఆ జీవునకు భక్తి , ప్రపత్తి అనే ఉపాయాలను చూపించి, వాటిలో ఏదో ఒక ఉపాయాన్ని అతడు చేసేటట్లు చేసి, దావానలం వలె వెలిగే అతని సంసార తాపాన్ని వెంటనే తీరుస్తుంది కదా – అని)

**॥ 19 ॥ సంసారంలో పరిభ్రమించే తమను రక్షించమని ప్రార్థించడం:**

**నీడోదరాన్నిపతితస్య శుకార్భకస్య**
**త్రాణేన విహరన్నివ సార్వభౌమః।**
**ఆదాయగోపనగరాధిపతే స్వయం మాం**
**క్రీడా దయా వ్యతికరేణ కృతార్థయ త్వమ్ ॥**

తిరుక్కోవలూరులోని స్వామీ! గూడులో ఉండే చిలుక ప్రమాదవశాత్తు ఆ గూడు నుండి కిందకు పడిపోతే దానిని చూచిన చక్రవర్తి తన గొప్పతనాన్ని మరచి కరుణతో దానిని దగ్గరకు తీసుకొని రక్షించి దానితో ఆడుతూ ఆనందిస్తాడు. ఆ విధంగానే నేను సంసార సముద్రంలో పడి పరిభ్రమిస్తూ ఉన్నాను. సర్వేశ్వరుడైన నీవు లీలగా దయతో ఈ సంసారం నుండి నన్ను పైకి లేవ తీసి, మోక్షం అనే గొప్ప ఫలాన్ని నేను పొందేటట్లు చేసి, నీవు కూడా కృతార్థుడవు కావాలి.

## ॥ 20 ॥ తమను రక్షించడం లక్ష్మీదేవికి ఆనందం కలిగిస్తుంది:

**లీలా శకున్తమివ మాం స్వపదోపలబ్ధ్యై**
**స్వైరం క్షిపన్దురిత పఞ్జరతో గుణస్థమ్ ।**
**తత్తాదృశం కమపి గోపపురీ విహారిన్**
**సన్తోషముల్లలయ సాగరసమ్భవాయాః ॥**

తిరుక్కోవలూరు అద్భుతమైన లీలలను చేసే స్వామీ! ఒక రాజు ఒక చోట స్వేచ్ఛగా తిరిగే ఒక చిలుక పిల్లను మూడు పేటలను కల దారంతో కట్టి బంధించి



గూడులో పెట్టడం, ఆ తర్వాత దానిని గూటి నుంచి బయటకు తీసి దాని ఇష్టప్రకారం బయట సంచరించేటట్లు విడిచిపెట్టడం, దానిని చూచి రాణి ఆనందించడం లోకంలో

జరిగే విషయం. నేను సత్వం, రజస్సు, తమస్సులు అనే మూడు గుణాలకు వశమై, సంసారంలో పడి పరిభ్రమిస్తూ ఉన్నాను. నన్ను ఈ పాపపు గూటి నుండి బయటకు తీసి, గొప్ప స్థానమైన నీ వైకుంఠానికి తీసుకొని పోవాలి. నీవు ఈ విధంగా చేస్తే నీకు ఒక లాభం ఉన్నది. పాలసముద్రంలో అవతరించి నీ వక్షస్సులో నిత్యంగా నివసించే లక్ష్మీదేవి అనే తల్లికి నేను కుమారుడను కదా. నాకు నీవు చేసిన ఉపకారాన్ని చూచి ఆమె ప్రీతితో అంతులేని అద్భుతమైన ఆనందాన్ని పొందుతుంది. ఇంతకంటే ఇంకొక గొప్ప లాభం నీకు ఏం కావాలి? ఏముంటుంది?

## II 21 II పాపాల వల్ల తమకు కలిగిన తాపాన్ని తీర్చమని ప్రార్థించడం:

**వాతూలకల్పవృజిన ప్రభవైర్మదీయాం**
**వైయాకులీం విషయ సిన్ధుతరఙ్గభఙ్గైః।**
**దానోపమర్దసహదుర్నిరసాం త్వదన్యైర-**
**నీక్ష్య గాఢ మనుకమ్పితుమర్హసిత్వమ్ ॥**

భక్తులైన ముదలాళ్వారుల సమర్థాన్ని సహించిన స్వామీ! నేను అంతులేని పాపాలను చేశాను. ఒక పెద్ద గాలి వీచి సముద్రంలో అలలను ఇంకా ఇంకా పైకి లేచేటట్లు చేసిన విధంగా, నా పాపరాసి అనే పెద్ద గాలి లౌకిక విషయాలను అనుభవించడం అనే కెరటాలను ఇంకా ఇంకా

అధికం చేస్తున్నది. అందువల్ల నా మనసు చాలా కలత పొందుతున్నది. ఈ కలతను పోగొట్టడం నీవు తప్ప వేరు ఏ దైవానికి సాధ్యం కాదు. నా ఈ స్థితిని, గతిని చూచి నాపై నీవు దయను బాగా ప్రసరింపజేసి నన్ను కాపాడాలి.

## ll22 ll తమ దీన దశను చూచి భగవంతుని దయ సహించలేదు అని తెలుపడం:

**ఏనస్వినీమితిసదామయిజాయమానాం**
**దేహల్యధీశ దృషదోఽపి విలాపయన్తీమ్ ।**
**నాథే సమగ్ర శకనే త్వయి జాగరూకే**
**కిం తే సహేత కరుణా కరుణామవస్థామ్ ॥**

తిరుక్కోవలూరులోని స్వామీ! పాపమే నిండి ఉండే నా ఈ గతి ఎల్లప్పుడూ ఈ విధంగానే ఉంటున్నది. ఈ స్థితిని చూసి రాళ్లు కరుగుతాయి. చూచినవారు నిశ్చయంగా నాపై దయను చూపుతారు. సర్వేశ్వరుడవు, అంతులేని శక్తిని కల వాడవైన నీవు చూస్తూ ఉండగా ఈ స్థితి ఇంకా నా విషయంలో కలగడాన్ని నీ దయాగుణం ఓర్చుకో గలదా? నిన్ను ప్రేరేపించి తప్పకుండా ఆ గుణం నాకు మంచి గతిని కలిగించి తీరుతుంది.

**॥ 23 ॥ అజ్ఞాన సముద్రంనుండి తమను గట్టెక్కించమని ప్రార్థించడం:**

**ఆత్మోన్నతిం పరనికర్షమపీహవాఞ్ఛన్ని-**

**మ్నేఽపి మోహజలధౌ నిపతామి భూయః।**

**తన్మాముదఞ్చయతవోన్నత పాదనిఘ్నం**

**దేహల్యధీశ గుణితేన దయా గుణేన॥**

తిరుక్కోవలూరు ఇంటి మధ్య భాగంలో ఆవిర్భవించిన స్వామీ! నేను ఎల్లప్పుడు నా గొప్పదనాన్ని, ఇతరుల తక్కువదనాన్ని కోరతాను. అందువల్ల లోతయిన అజ్ఞాన సముద్రంలో మాటిమాటికి కూరుకుపోతున్నాను. లోతయిన జలప్రదేశంలో పడిన వారిని మూడు పేటలతో కాని, అయిదు పేటలతో కాని పేనిన దారంతో పైకి లాగడం లోకంలో సహజం. ఆ విధంగానే నీ గొప్ప కరుణ అనే గుణంతో (దారంతో) నీవు త్రివిక్రముడవై పైకి ఎత్తిన నీ పాదం ఎత్తుకు నన్ను ఉద్ధరించి కాపాడాలి. నీ పాదం బ్రహ్మాండం బయటకు కూడా ప్రసరించింది కనుక, అంతవరకు నన్ను ఉద్ధరిస్తే సంసార మండలం నుండి దాటి నేను ముక్తిని పొందుతాను.

**II 24 II తమ మంచిని చింతించి అనుగ్రహించమని ప్రార్థించడం:**

**అక్షీణ కల్మషరసోఽపి తవానృశంస్యాత్**

**లక్ష్మీసమక్షమపి విజ్ఞాపయామ్యభీతః।**

**భక్తోపమర్దరసిక స్వయమల్ప బుద్ధేః**

**యన్మన్యసే మమహితం తదుపాదధీథాః॥**

భక్తులైన ముదలాళ్వారులు నిన్ను సమ్మర్దించగా దానివల్ల ఆనందాన్ని పొందిన స్వామీ! ఎల్లప్పుడూ



పాపాలను చేయడంలోనే నాకు ఉండే రుచి కొంచెం కూడా తగ్గలేదు. అయినా, నీ దయను భావిస్తూ దానిని సహాయంగా చేసుకొని నీ దగ్గర ఒక విన్నపాన్ని చేయాలని భయం లేకుండా ముందుకు వస్తున్నాను. ఇంతేకాక నా విషయంలో ప్రేమను కలిగి పలికే లక్ష్మీ దేవి నీ దగ్గర ఉన్నందున, ఇంకా అధికమైన ధైర్యంతో ఆమె సమక్షంలో కూడా నేను విజ్ఞాపన చేస్తున్నాను. అది ఏమిటి? అంటే, అల్పజ్ఞుడనైన నాకు నా మంచిని ఏదో విచారించి తెలిసికొనే శక్తి లేదు. అందువల్ల నాకు ఏది మంచిది? అనేదానిని నీవే విచారించి దానిని చేయాలి.

**II 25 II తమ ఆకించన్యాన్ని చూచి భగవంతుడు తమను రక్షించడానికి ముందుకు రావడం:**

**మన్యే దయార్ద్ర హృదయేన మహాధనం మే**
**దత్తం త్వయేదమనపాయమకిఞ్చనత్వమ్ ।**
**యేన స్తనన్ధయమివ స్వహితానభిజ్ఞం**
**న్యాసీకరోషి నిజపాద సరోరుహే మామ్ ॥**

తిరుక్కోవలూరులో ఉండే స్వామీ! వేరు ఏ ఉపాయాన్ని చేయడానికి యోగ్యత లేని వానికే నీ సన్నిధిలో శరణాగతి చేయడానికి తగిన యోగ్యత ఉన్నది. నేను ఉపాయాన్ని చేయగలిగిన శక్తి కలవాడను కాను. నాకు ఏది

మంచి అనే విషయం కూడా తెలియకుండా, పాలు తాగే కుర్రవాణ్ణి వయస్సులో ఉన్నట్లు ఉన్నాను. నన్ను నీవు నీ పాద పద్మాలలో శరణాగతిని చేసేటట్లు చేసి, నన్ను రక్ష్య వస్తువుగా స్వీకరించావు. దీనిని భావించినప్పుడు ఒక సత్యం వ్యక్తమవుతున్నది. నా విషయంలో కరుణ కల నీ మనసు చాలా ఆర్ద్రంగా ఉన్నది. నేను వేరు ఏ ఉపాయంలోనూ ప్రవేశించకుండా ఉండేటట్లు నన్ను చేసి, ప్రపత్తి అనే సులభమైన ఉపాయంలో ఆసక్తిని కలవాడను అయ్యేటట్లు చేయాలని భావించావు. అందుకోసం నన్ను వేరు ఏ ఉపాయాన్ని చేయడానికి శక్తిలేని వానినిగా చేశావు. ఇందువల్ల నాకు ప్రపత్తిని చేసే యోగ్యత కలిగింది. ఈ యోగ్యత మోక్షానికి దారిని చూపే, నశించని గొప్ప సంపదగా కదా నాకు ఏర్పడింది!

**II 26 II భగవంతుడు తన కరుణతో తమను అనుగ్రహించడం:**

**దుర్వారతీవ్ర దురితప్రతివాపదూకై**
**రౌదార్యవద్భిరనఘస్మితదర్శనీయైః ।**
**దేహల్యధీశ్వర దయా భరితైరపాఙ్గై**
**ర్వాచం వినాఽపి వదసీవ మయి ప్రసాదమ్ ॥**

తిరుక్కోవలూరులోని స్వామీ! నీ కరుణా కటాక్షాల గొప్పతనానికి అంతులేదు. అవి, ఇక దేని చేత పోగొట్టడానికి




వీలు కాని క్రూరమైన పాపాలను అన్నిటినీ పోగొట్టగలిగినవి. నీ కటాక్షం ఎవరిపైన అయినా పడినట్లయితే అతని పాపాలు అన్నీ తీరిపోతాయి కదా! ఆ కటాక్షాలు ఎటువంటి ఫలాన్ని అయినా ఇవ్వగలిగినవి. నీ ముఖంలో ఏ వంచన లేకుండా ప్రకాశించే చిరునవ్వుతో నీ కటాక్షాలు కలసినప్పుడు చూడడానికి చాలా అందంగా ఉంటుంది. ఆ కటాక్షాలలో కరుణ ప్రవహించడం స్పష్టంగా తెలుస్తుంది .ఇటువంటి చూపులను నాపై ప్రసరింప చేసేటప్పుడు నీవు నీ

అనుగ్రహాన్ని నోటితో స్పష్టంగా చెప్పకుండా చూపుల ద్వారానే తెలియజేస్తున్నట్లుగా తోస్తున్నది.

**॥ 27 ॥ పంచ సంస్కారం పొందివారికి చేసే అనుగ్రహం:**

**అయమనవమసూక్తైరాదిభక్తైర్యథావద్వివిదిత**
**నిజసుతత్త్వే విశ్వమవ్యాదభవ్యాత్ ।**
**రథచరణనిరూఢ వ్యఞ్జనానాం జనానాం**
**దురితమథన లీలా దోహలీ దేహలీశః ॥**

తిరుక్కోవలూరులోని ఒక ఇంటి మధ్యభాగంలో అవతరించిన త్రివిక్రమ స్వామిని సమ్మర్దించినందున ఆ స్వామిని దర్శించినవారు ముదలాళ్వారులు. అందువల్ల వారు ముగ్గురు చాలా గొప్పవి అయిన మూడు ప్రబంధాలను పాడారు. ఆ ప్రబంధాలు భగవంతుని స్వరూపం, రూపం, గుణాలు, మహిమ మొదలైన వానిని యథాతథంగా వర్ణించ గలిగినవి. ఆ స్వామి ధరించిన శంఖచక్రాల ముద్రలను తమ భుజాలపై ముద్రింపబడి, పంచ సంస్కారాలను చేసుకున్న వారి సకల పాపాలను పోగొట్టడం అనేదానిని ఒక లీలగా అతడు సంకల్పించాడు. ఆ స్వామి లోకానికి ఏ కీడు కలుగకుండా కాపాడాలి.

**II 28 II ఈ స్తోత్రాన్ని అనుసంధిస్తే కోరిన ఫలం కలుగుతుంది:**

**ఇయమవితథవర్ణా వర్ణనీయ స్వభావా-**
**ద్వ్యదితనిగమసీమ్నా వేఙ్కటేశేన గీతా ।**
**భవమరుభువితృష్ణాలోభపర్యాకులానాం**
**దిశతు ఫలమభీష్టం దేహలీశ స్తుతిర్నః ॥**

వేదాంతాల అవధిని దర్శించిన వేంకటేశకవి అనే నాచే రచింపబడినది–ఈ దేహళీశస్తుతి అనే స్తోత్రం.



ఇందులో ఒక్క అక్షరం కూడా అబద్ధం కాదు. సాధారణ మానవుని కీర్తిస్తే కదా అది అబద్ధం అవుతుంది. సర్వేశ్వరుడైన తిరుక్కోవలూరులోని భగవంతుని కీర్తించే ఈ స్తోత్రంలో ఆసత్యం కలిసే అవకాశం ఎక్కడ ఉన్నది? లోకంలోని వస్తువులలో అన్నిటిలోనూ మనకు ఉండే ఆశకు అంతులేదు. మన ధనాన్ని వినియోగం చేయడానికి మనకు మనసు లేదు. ఇటువంటి నీచ గుణాలతో ఈ సంసారమనే ఎడారిలో ఆర్తిని పొందే మనం, మనకు చెందినవారు ఈ స్తోత్రాన్ని అనుసంధిస్తే మనం కోరే అన్ని ప్రయోజనాలను పొందవచ్చు.

**కవితార్కిక సింహాయ కల్యా ణ గుణశాలినే ।**
**శ్రీమతే వేంకటేశాయ వేదాంత గురవే నమః ॥**

# దేహళీశస్తుతి ఆంధ్ర వ్యాఖ్యానం సంపూర్ణమ్

